# శ్రీ దక్షిణేశ్వరీస్తవము





కర్త :

'సాధన రహస్య' 'సర్వ సిద్ధాంత సౌరభా' ది

బహు గ్రంథకర్తలు

శ్రీ రామకృష్ణాశ్రమములు (బాపట్ల - శ్రీమానిపట్నము)

సంస్థాపకులు :

పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీ శ్రీ శ్రీ అనుభవానంద స్వామి



ప్రకాశకులు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల

ప్రచురణ సంఖ్య : 003

పంచమ ముద్రణము : 1996

వెల : రు. 3.00

ప్రతులకు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల,
యం.జి. రోడ్డు, బాపట్ల - 522 101
గుంటూరు (జిల్లా).

మరియు

స్వామి అనుభవానంద యోగకేంద్ర,
భీమునిపట్నము - 531 163,
విశాఖపట్నం (జిల్లా).

# పరిచయము

భగవంతుడు మానవులకు మనస్సును హృదయాన్ని ప్రసాదించాడు. మనస్సుద్వారా వివేకవైరాగ్యాల్ని పెంపొందింపజేసికొని, హృదయంద్వారా దివ్యానుభూతిని పొంది, జీవితాన్ని సఫలం చేసుకోమని ఆయన దివ్యసందేశమేమో! ఈ మనోహృదయ సమ్మేళనమే 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' అను ముండకోపనిషద్వచనరీతి శాస్త్రజ్ఞాన అనుభవజ్ఞాన సమైక్యమై, సర్వ సమన్వయమును ప్రబోధించుచున్నది. ఇదియే భారతీయాధ్యాత్మిక సకల సమత్వసారము.

నేటి మానవునిలో మనస్సు విజృంభించి, మేధాశక్తి అభివృద్ధి చెందుచున్నదే కాని హృదయం అసలు లేదేమో అనిపించుచున్నది. కారణం మానవతా లక్షణములైన దయాదాక్షిణ్యాదులు లోపించటమే. మనస్సు హృదయంలో లీనం అయితేనేగాని మనోవికారములు నశించవు. మనోవికారాలు నశిస్తేనేగాని ప్రశాంతి కలుగదు.

పై లోపములన్నీ మానవునిలో పోవాలంటే ఏమి చేయాలి? కన్నతల్లిని, ఆమె ప్రేమవాత్సల్యాలను అర్థం చేసుకోవాలి ప్రథమంగా. అప్పుడు జగన్మాత నిర్మల ప్రేమవాత్సల్యాలకై తపించి, ఆవేదన చెందుతాడు. పసిబిడ్డయై విలపిస్తాడు. ఆ లోకమాత దర్శన, స్పర్శన, సంభాషణములతో ఎనలేని శాంతిని పొందుతాడు.

మాతాజీ త్యాగీశానందపురి

చ. అనుపమవిక్రమోజ్వలమహాద్భుతశక్తి చరాచరంబులన్
గని భరియించి తల్లయమకామ్యత జేయు నచింత్యలీలలో
మునుగుచు దేలుచుందువట మూర్తివహించిన మృత్యువో
యనన్

నిను నెటు జేరువాడ జననీ! కరుణామయి! దక్షిణేశ్వరీ! ...1

అమ్మా! దక్షిణేశ్వరీ! కరుణామయీ! చరాచరసృష్టి, స్థితి, లయముల నిష్కామంగా జేయుచు, మనస్సునకందని లీలలో మునుగుచు, అపర మృత్యువో యనునట్లుండు నిన్ను ఏవిధంగా చేరేది?

ఉ. చండిక! యెట్లు నిన్ గన! ప్రచండపరాక్రమవిక్రమప్రభా
ఖండ విభూతమూర్తిరో! అగాథ మహాప్రళయాబ్ధిరూప! బ్ర
హ్మాండనికాయసంస్థిత మహాద్భుతగర్భనిబద్ధరూపిణీ!
దండము భావదూర! వినుతా! ప్రతిభాయుత! దక్షిణేశ్వరీ .2

అమ్మా! చండికా! ప్రచండపరాక్రమప్రభామూర్తీ! మహాప్రళయాబ్ధిరూపిణీ! భావదూరా! ప్రతిభాస్వరూపిణి! సర్వ ప్రపంచాన్ని గర్భంలో ధరించిన నీకు నమస్కారము. ఈ విధంగా ఉన్న నిన్ను ఏ విధంగా చూచేది?

చ. భవుడు లయింప, మాధవుడు పాలనసేయ, సృజింప బద్మసం
భవుడు, శక్తినీవిడక వారికి సాధ్యమె! ఏల బ్రహ్మమే
అవశత నీకధీనమయి యాడుట గీర్తివహించె బ్రహ్మగా
భవతరణీ! మహాప్రతిభ! భావవిలక్షణి! ...3

అమ్మా! భవతరణీ! భావవిలక్షణీ! మహాప్రతిభా! నీవు నీ దివ్యశక్తిని ప్రసాదింపకున్న ఆ బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, సృష్టి స్థితి లయాల్ని చేయగలరా? అసలు ఆ బ్రహ్మమే నీకు స్వాధీన్నమైయున్నదిగదా!

ఉ. అల్పమదెట్లు నీవు? జగదంబ! పరాపరశక్తి! బ్రహ్మసం
కల్పమ! నాద బిందు కళ! కాల! మహేశ్వరి! భద్రకాళికా!
సల్పవె నిర్గుణున్ సగుణు! సర్వమెయౌదువు! నీవు మాయవే
కల్పనవే! యవిద్యవట! కల్లపదంబులు!.. 4

అమ్మా! మహేశ్వరీ! భద్రకాళికా! బ్రహ్మసంకల్పమా! నాదబిందుకళాస్వరూపిణీ! కాలరూపిణీ! జగదంబా! పరాశక్తీ! నిర్గుణబ్రహ్మన్ని సగుణం చేస్తున్నావు. సర్వము నీవేగదా! అట్టి నీవు అల్పం ఎట్లా అవుతావు? నీవు మాయవని, కల్పనవని, అవిద్యవని చెప్పటం అబద్ధమే.

ఉ. ధాత శివుండు విష్ణువు సదా పరిచర్య జరించి వీడరే
ఏ త్రుటిగాని నిన్ను, నిక నీశ్వరి లక్ష్మి సరస్వతుల్ గుణో
పేతవు నీదు సేవ గడుప్రేమ మునుంగుచునుంద్రు, కాన నే
రీతిగ బోలరారు సురలెవ్వరు నీకును.. 5

అమ్మా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముప్వురు, వారి శక్తులైన వాణీ లక్ష్మీ పార్వతులు ముప్వురు, సద్గుణరాశివైన నిన్ను ప్రేమతో సదా సేవిస్తూ ఉంటారు. ఆ దేవతలుకూడ నీకు సరికారు.

ఉ. కాశిగయాది క్షేత్రములు, గంగ, సరస్వతీ, నాగతీర్థముల్
నీ శరణొంది పాదముల నిత్యమునుండగ వాని సంసృతీ
పాశవిముక్తికై కొలువ వమ్మగదా! నిను గొల్వ బూర్తిగా
నాశమునొందు బాపమని నమ్మదు నెప్పుడు.. 6

అమ్మా! పావనీ! పరమేశ్వరీ! భానుకోటివిభవా! అనుభవం భావాతీతముగదా! భావాతీతమైన నిన్ను భావించి వ్రాయటం సాధ్య మా? ఇక నిన్నుగూర్చి వచించుట హాస్యాస్పదంగా విశ్వసిస్తున్నాను.

ఉ. అక్షరసంపుటీకరణమౌ సకలాగమశాస్త్రపంక్తి నీ
వక్షముపైని హారముగ భాసిలుగాని హృదంతరాళమున్
వీక్షణ జేసి చెప్పగలవే! నిజతత్త్వమెరుంగునే! విశా
లాక్షి! విమోక్షలక్ష్మి! ఉమా! సాక్షి! సురక్షణి! .. 10

అమ్మా! విశాలాక్షీ! విమోక్షలక్ష్మీ! ఉమా! సురక్షణీ! అక్షర సమూహములతో కూడియుండు సర్వశాస్త్రసంచయము నీహృద యముపై హారముగా నున్నవి కాని ఆ శాస్త్రపంక్తి నీ హృదయాంతరమును, నీ నిజతత్త్వాన్ని గ్రహింపగలవా?

చ. అనుభవమైన నిర్మలరసామృతవర్ణన దుస్సహంబటం
చును వచియించి యుండియు వచోగరిమన్బ్రకటింపబూని నీ
యనుపమశుద్ధతత్త్వమునహో కలుషంబుగ జేసిరే ఋషుల్
జననీ! అచింత్యతత్త్వరససారఘనే! ఉమ! .. 11

అమ్మా! అచింత్యతత్త్వరససారఘనే! ఉమా! నిర్మలమైన అనుభవమును వచించుట కష్టమని పలుకుచు, మరల వర్ణించుటకు పూనుకుని, నీ శుద్ధతత్త్వమును కలుషంగా తయారుచేశారు ఋషి వరేణ్యులు.

ఉ. అంతములేని తత్త్వము నమాంతముగా గబళించినట్లు సి
ద్ధాంతము జేసి, బ్రహ్మమని దానికి బేరిడి, దాని జెప్ప వే
దాంతమటంచు బల్కిరిగదా గురులోకము; నేనుమాత్రమా
భ్రాంతి మునుంగనట్లు నను బాలనసేయవె.. 12

అమ్మా! పావనీ! పరమేశ్వరీ! భానుకోటివిభవా! అనుభవం భావాతీతముగదా! భావాతీతమైన నిన్ను భావించి వ్రాయటం సాధ్య మా? ఇక నిన్నుగూర్చి వచించుట హాస్యాస్పదంగా విశ్వసిస్తున్నాను.

ఉ. అక్షరసంపుటీకరణమౌ సకలాగమశాస్త్రపంక్తి నీ
వక్షముపైని హారముగ భాసిలుగాని హృదంతరాళమున్
వీక్షణ జేసి చెప్పగలవే! నిజతత్త్వమెరుంగునే! విశా
లాక్షి! విమోక్షలక్ష్మి! ఉమా! సాక్షి! సురక్షణి! .. 10

అమ్మా! విశాలాక్షీ! విమోక్షలక్ష్మీ! ఉమా! సురక్షణీ! అక్షర సమూహములతో కూడియుండు సర్వశాస్త్రసంచయము నీహృద యముపై హారముగా నున్నవి కాని ఆ శాస్త్రపంక్తి నీ హృదయాంతరమును, నీ నిజతత్త్వాన్ని గ్రహింపగలవా?

చ. అనుభవమైన నిర్మలరసామృతవర్ణన దుస్సహంబటం
చును వచియించి యుండియు వచోగరిమన్ బ్రకటింపబూని నీ
యనుపమశుద్ధతత్త్వమునహో కలుషంబుగ జేసిరే ఋషుల్
జననీ! అచింత్యతత్త్వరససారఘనే! ఉమ! .. 11

అమ్మా! అచింత్యతత్త్వరససారఘనే! ఉమా! నిర్మలమైన అనుభవమును వచించుట కష్టమని పలుకుచు, మరల వర్ణించుటకు పూనుకుని, నీ శుద్ధతత్త్వమును కలుషంగా తయారుచేశారు ఋషి వరేణ్యులు.

ఉ. అంతములేని తత్త్వము నమాంతముగా గబళించినట్లు సి
ద్ధాంతము జేసి, బ్రహ్మమని దానికి బేరిడి, దాని జెప్ప వే
దాంతమటంచు బల్కిరిగదా గురులోకము; నేనుమాత్రమా
భ్రాంతి మునుంగనట్లు నను బాలనసేయవె .. 12

అమ్మా! అంతములేని తత్త్వమును కబళించినట్లు సిద్ధాంతం చేసి, బ్రహ్మమనే పేరు పెట్టి, అదే వేదాంతమని గురువర్యులు బోధించారు. కాని నేనుమాత్రము అటువంటి భ్రాంతినొందనట్లు అనుగ్రహించు.

చ. తెలుపగరావు నీమహిమ దెల్ప నసంఖ్యముగైన విశ్వముల్!
దెలియగలేరు నీ ప్రతిభ దేవతలెల్లరు చేర్చియైన! నే
దెలియగనేర్తునే నిను నతీంద్రియరూపివి! నీ యనుగ్రహం
బుల గనకున్నచో జనని! ముఖ్యము నీకృప .. 13

అమ్మా! నీ మహిమనుగూర్చి అసంఖ్యాక లోకములైనను తెలుపలేవు. దేవతలందరును నీప్రతిభను తెలుసుకోలేరు. నీఅను గ్రహం వినా యింద్రియాతీతవైన నిన్ను గ్రహింప గలనా? అన్నింటికి నీ కృప ముఖ్యమమ్మా!

ఉ. దక్షిణరాజ్యమౌ నరక దైవము కావుట దక్షిణేశ్వరీ!
దక్షిణతంత్రపద్ధతికి దైవము కావుట దక్షిణేశ్వరీ!
దాక్షిణతారసంబుగల దైవము కావుట దక్షిణేశ్వరీ!
తక్షణ మోక్షదాత యగు దైవము కావుట .. 14

అమ్మా! నీవు దక్షిణరాజ్య దైవానివి కావటంచేత 'దక్షిణేశ్వరీ' అని నీకు పేరు కలిగిందా? లేక దక్షిణతంత్రపద్ధతికి దేవతవు కావటంచేత దక్షిణేశ్వరివా? లేక వెంటనే మోక్షప్రదాత్రివి కావటంచేత దక్షిణేశ్వరివి అయ్యావా?

ఉ. సర్వము భస్మరూపముగ సల్పెడు భీకరమైన యగ్నియే
గర్వమువోవ చల్లనయి గంధముచందముగాదె సాధ్వి యా
సర్వసుశీల సీత తన సన్నిధి జేరినవెంట, నట్లు నే
నుర్విని సాధురక్షణము బూనవె సత్యము .. 15

అమ్మా! భయంకరమైన అగ్ని సర్వాన్ని భస్మం చేస్తుంది. కాని అటువంటి అగ్నికూడా సుశీలయైన సీతాసాధ్వి అగ్నిప్రవేశం చేయగానే గంధమువలె చల్లబడ్డదట! అదేవిధంగా నీవుకూడా ప్రేమతో సాధుసంరక్షణ సాగించు.

చ. అది యటుగానిచో నిను మహాప్రళయాకృతి జేర నెందరో
సదమల కీర్తిశాలురు ప్రశస్తవిధంబున గొల్చి నిన్ను, నీ
హృదయజమౌ కృపాఝరుల దృష్ట నశింపగ గ్రోలి యెట్లు స
ముద్రదముచెలంగ మైమరచి ముక్తిని బొందిరి .. 16

అమ్మా! ఆ విధంగా నేవు సాధురక్షణ చేయకున్న, మహాభయంకరివైన నిన్ను ఎవ్వరైనా చేరగలరా? నిన్ను ఆరాధింపగలరా? నీ హృదయజన్య కృపాప్రవాహమును తమ కోర్కెలన్నియు నశించునట్లు త్రాగగలరా? ఆనందంతో తన్మయులై ముక్తిని పొందుట సాధ్యమా?

ఉ. సర్వజగంబు నీదు ప్రశస్త విభూతిగ బల్కుచుందు్రు, యీ
సర్వములోన నీయునికి జాటు మహర్షిగణంబులెల్లరున్,
సర్వము బ్రహ్మమౌననుచు శాస్త్రము బల్కునుగాని యమ్మరో!
నేర్వగనైతి నా విధము నిర్మలదృష్టిని .. 17

అమ్మా! ఈ జగమంతయు నీ విభూతి అని, అంతటా నీవే ఉన్నావని మహర్షివరేణ్యులు చెప్పుతున్నారు. 'సర్వం బ్రహ్మస్వరూపమే' అని శాస్త్రంకూడ చెప్పుతున్నది. కాని నిర్మలమైన దృష్టితో ఆ పద్ధతిని నేర్చుకోలేకపోయాను.

ఉ. పుట్టములన్న దిక్కులగు, బువ్వలదండ కపాలమాల, చే
బట్టుట మ్రుసకంబు కరవాలములన్, గను లగ్నిగుండముల్,
గట్టని దీర్ఘకుంతలము, కాళ్లకు గ్రింద శివుండు మూర్ఛలో,
నెట్టిది నీ స్వరూపమతిహింస్రము శారద! .. 18

అమ్మా! నీకు దిక్కులు వస్త్రాలు. పుర్రెలదండయే పూల మాల. చేతుల్లో పుర్రె, ఖడ్గములు. పొడవైన తలకట్టు. నేత్రములు అగ్నిగోళములు. పాదములక్రింద సమాధిలోనున్న ఈశ్వరుడు. నీ స్వరూపం ఎంత భయంకరంగా ఉన్నదో!

చ. అయిన నదో యభయహస్తము! భక్తులనెల్ల నెప్పుడున్
నయమున జేరదీసి కరుణార్ద్రత బ్రోచెడు కామధేనువై
భయములదీర్చు సూత్రము! కృపానిధివంచు నెరింగినాడ, నీ
దయ యను వర్షమందు నను దన్మయు జేయుము .. 19

అమ్మా! అదిగో అభయహస్తం. కామధేనువై, కరుణతో భక్తులచేరదీసి భయమును పోగొట్టుసూత్రం! నీవు దయామయివని గ్రహించాను. నీకృప యను వర్షంలో నన్ను దన్మయునిగా చెయ్యి తల్లీ.

ఉ. రాముడు నిన్నుబాయుట స్థిరత్వము బోవగ వెర్రిగాడె! రా
ధామతి గృష్ణుడో విరహతాపము నొందడె పిచ్చివాడుగా!
నీ మహిమంబుగానక ననేకులు భ్రాంతులుగారె, యట్టులే
ప్రేమ ద్యజించి నన్ను భయపెట్టకుమమ్మరొ .. 20

అమ్మా! సీతాస్వరూపిణివైన నిన్ను దూరము చేసికొని అస్థిరుడై వెర్రివాడయ్యాడు, రాముడు. రాధికారూపిణివైన నిన్ను ఎడబాసి, విరహంచేత పిచ్చివాడయ్యాడు కృష్ణుడు. నీ మహిమను తెలుసుకోలేక ఎంతమంది భ్రాంతిని పొందారో! ప్రేమ రహిత్వవై ఆవిధంగా నాకుమాత్రం భయం కలిగించకమ్మా!

ఉ. నీవు విశిష్టమంచు, మరి నిర్గుణమంచు, నభేదభేదమున్
నీవగు ద్వైతమంచు, మరి నేలగళుండును విష్ణుడంచు నిన్
దేవిరొ! శూన్యమంచు నిను దేల్చి నిజంబని పొంగిరే బుధుల్
భావవిదూరమంచు హృది భావనసేయరె! .. 21

అమ్మా! నిన్ను పండితులు విశిష్టమని, నిర్గుణమని, ద్వైత మని, విష్ణువని, ఈశ్వరుడని, శూన్యమని నిర్వచించి, అదే సత్య మని పొంగిపోయారు. కాని నిన్ను భావవిదూరవని భావించ లేక పోయారుకదమ్మా!

ఉ. నీదు యనుగ్రహంబున ననేకులు దుర్ఘట మాయ దాటి, స
మ్మోదముతో నతీతులయి మోక్షము నొందిరటంచు వింటి నీ
భేదములేలనమ్మ! యిది ప్రేమ యనంబడునే! కృపామతిన్
నా దురవస్థ బాపి భవనాశమొనర్పవె .. 22

అమ్మా! అనేకమంది నీ అనుగ్రహంతో మాయ నతిక్రమించి, ఆనందంగా మోక్షాన్ని పొందారని విన్నాను. ఇటువంటి భేదం నీకు తగునా? ఇదేనా ప్రేమ? కరుణామూర్తివై, నా యీ దురవస్థను పోగొట్టి, జన్మరాహిత్యాన్ని కలిగించవమ్మా!

ఉ. అక్షరపంక్తి రాని నరు నక్షరుగా నొనరించి, పై సువ
ర్ణాక్షరపంక్తితో నతని నామము వ్రాసితి గాళిదాసుగా!
నక్షరమాలికావిభవ! యంతటి ధన్యుడ నేను గానొకో!
అక్షరు జేయుమమ్మ! నను నల్పుని సత్కృప .. 23

అమ్మా! అక్షరమాలికావిభవా! నిరక్షరుడైన కాళిదాసుని మహాపండితునిగా జేసి, లోకమున నాతని పేరును సువర్ణాక్షరము లలో శాశ్వతం చేశావుగదా! నేను అంతటి ధన్యుడను కానా! నీ కృపతో అల్పుడినైన నన్నుకూడ అక్షరునిగా చెయ్యమ్మా.

ఉ. మొన్నగదా! నిరక్షరుడు, పూర్తిగ బేద, ననామకుండు, యీ
పిన్నని బెద్ద జేసి 'భువి పెద్ద మరొండు గలండె యౌర! అ
న్నన్న!' యనన్ జగంబులు మహాత్మని జేసితిగాదె! యీ జగ
త్సన్నుతు రామకృష్ణుని యసాధ్యమె నన్ గొన .. 24

అమ్మా! అనామకుడు, పేద, నిరక్షరుడు, చిన్నవాడైన ఆ రామకృష్ణుని 'ఆహా! ఇంతకంటె గొప్పవ్యక్తి మరి లేడు' అని లోకం మెచ్చుకునేటట్లు మహాపురుషునిగా చేశావుగదా! నన్ను స్వీకరించుట మరి నీకు అసాధ్యమా తల్లీ!

ఉ. పాటలటన్న నీకమిత ప్రాణమటందును, కానిచో శివా
గాటపు ప్రేమమై కమలకాంతుని రామప్రసాదు బ్రోచినా
వేటికి? యౌను నీదు తనువేగద నాదము! నేను వ్రాయనే
పాటల బద్యసంపదల భక్తి జెలంగగ .. 25

అమ్మా! శివా! నీవు నాదస్వరూపిణివి. అందుచేతనే నీకు పాటలన్న ప్రీతి. ఆ ప్రీతి నీకులేకున్న నిన్ను కీర్తించిన ఆ రామ ప్రసాద, కమలకాంతులను ఎందుకు రక్షించావు? నేను మాత్రం భక్తితో పాటలను, పద్యములను వ్రాయనా?

చ. చదివిన బాండితీగరిమ సాధ్యపడున్, యశమున్ ఘటిల్లు, నా
చదువులు నిన్ను జేర్చుటకు జాలవుగా! యది లెక్కలేదు, యే
చదువులు నిన్ను జేర్చుచు బ్రశాంతయశోవిభవంబులిచ్చు నా
చదువుల నేర్పి, నీదు ఘనసన్నిధి నుంపుము .. 26

అమ్మా! విద్య, పాండిత్యాన్ని కీర్తిని కలిగిస్తుంది, ఆ చదువులు నిన్ను చేర్చలేవుగదా! అందుచేనవి అనవసరం. కాని ఏ చదువులు నిన్ను చేర్చి, ప్రశాంతిని కలిగిస్తాయో ఆ చదువుల్ని నాకు నేర్పి, నీ దివ్యసన్నిధిలో ఉంచు తల్లీ! చాలు.

ఉ. శిరములదండ కంఠమున జేర్చితివే! యది యందమొక్కొ? భీ
కరము నశుభ్రమై తనరుగాదె! భవాని! పవిత్రభావ సం
భరితములైన పద్యసుమపంక్తిని హారము జేసినాడ, నీ
యురమున దాల్పు 'సుందరి'గ నుందువు నిక్కము .. 27

అమ్మా! భవానీ! భయప్రదమై, అశుచియైన శిరముల దండను మెడలో ధరిస్తావన్న పవిత్ర భావములతో కూడిన పద్యములనే పుష్పములతో హారాన్ని తయారు చేశాను. ఈ హారాన్ని వేసుకుంటే నీవు నిజంగా అందంగా ఉంటావమ్మా!

ఉ. భ్రాంతియటన్న విశ్వమున భాసిలునో! తన చిత్తవృత్తినో!
శాంతమనంబుతో గనిన సత్యము గ్రాహ్యము, చిత్తమేగదా
భ్రాంతినివాసమై చెలగు! భ్రాంతి జగంబున నున్నదే? యిదే
భ్రాంతికి గారణంబు భవబంధవిముక్తియు .. 28

అమ్మా! భ్రాంతి లోకంలో ఉన్నదా, లేక మనస్సులో ఉన్నదా అని ప్రశాంతంగా ఆలోచించినచో యథార్థం వ్యక్తం అవుతుంది. అసలు భ్రాంతికి కారణం మనస్సు. ఈ మనస్సే బంధమోక్షములకు మూలమ్మగదా! భ్రాంతి ప్రపంచములో ఉన్నదా అమ్మా!

ఉ. సర్వము భ్రాంతి మాయయని, సారవిహీనమటంచు నెంచి, తా
మోర్వగలేక లోకమొక యుగ్రపిశాచముభంగి చూచి, తా
మూర్వి ప్రశాంతియేగనకనుందురు పెక్కురు తల్లి, లోకమే
సర్వవిముక్తిమార్గముగ సాధన సేయరె! .. 29

అమ్మా! అనేకులు సర్వము మాయ అని, భ్రాంతి అని, సారరహితమని, లోకం పెనుభూతమని భావించి అశాంతిపాలగుచున్నారు. లోకమే ముక్తికి మార్గమని సాధన చేయరుగదా!

ఉ. దయ్యముచేత బట్టుబడి దయ్యము పట్టినదంచు నేర్చినన్
దయ్యము పారిపోవుగతి తక్షణమంతముగాదె భ్రాంతి 'నా
కయ్యెను భ్రాంతి' నా దెలియనట్టి స్వకీయమనోభ్రమంబుకై
'ఎయ్యది భ్రాంతి' యంచు, వెలి నేటికి జూచుట .. 30

అమ్మా 'నాకు దయ్యం పట్టింది' అని దయ్యముచేత పట్టు బడినవ్యక్తి గ్రహిస్తే ఆ దయ్యం పారిపోతుంది. అదేవిధంగా 'నాకు భ్రాంతి కలిగింది' అని లోనున్న తన మనస్సుచేతనే గ్రహించాలి కాని బాహ్యలోకంలో వెతకటం దేనికమ్మా?

ఉ. మాయట, మాయ మాయ యని మాయను ధ్యానము జేసి వెర్రులై
మాయయటన్న భ్రాంతిపడి మ్రగ్గుదురమ్మ జనంబు, లేనిదే
మాయ యటంచు నేర్చిన నమాంతము మాయముగాదె మాయ। ఈ
న్యాయమెరుంగుటే యసలు ఆర్షవిధానము.. 31

అమ్మా! ఈ జనమంతా భ్రాంతిచేత 'మాయ మాయ' అని, ఆ మాయనే ధ్యానిస్తూ వెర్రివారవుతున్నారు. కాని వీరు యీ మాయనుగూర్చి 'లేనిదే మాయ' అని గ్రహించిన మాయ మాయ మవుతుందిగదా! ఈ సూత్రాన్ని గ్రహించుకోటమే అసలు ఆర్ష విధానముసుమా!

చ. పడితిని మాయలోబడితి భ్రాంతిని బొందితినన్న మాయలో
బడి చెడిపోదురీ జనులు పాపము, మాయిని నిన్ను మాయగా
గడు నవివేకులై తలచి గాంచరు నీ యసమానమౌ కృపా
ఝరిని, విముక్తినిచ్చు ఘనశక్తిని, శారద! .. 32

అమ్మా! శారదా! మాయచే భ్రాంతిలో పడితిమను మాయా భావనచేత యీ లోకులు చెడిపోవుచున్నారు. పాపం, మాయివి అనగా తల్లివైన నిన్ను అవివేకముతో మాయగా భావించి, నీ అసమానమైన కృపాప్రవాహాన్ని, మోక్షప్రదాత్రివైన నీ అనంతశక్తిని గ్రహించుకోలేకున్నారు తల్లీ!

చ. ప్రతిఫలమైన శాఖచివరన్, బ్రతిబింబితమౌ ఫలంబు స
మ్మతి భుజియించినట్లు గని మానసవీధి సుఖించురీతిగా

బ్రితిమల, శాస్త్రవాక్యతతులన్ గని గాంచితి నిన్నె యంచు నే
మతి చెడి భ్రాంతినొందితిని మాతరొ! గాంచవె! ‥ 33

అమ్మా! జలములో ప్రతిఫలించిన ఫలాన్ని భుజించి, తృప్తి పొందినట్లు భావించురీతి, శాస్త్రవాక్యములలో, విగ్రహములలో నిన్ను చూస్తున్నట్లుగా మతిలేక భ్రాంతిని పొందుతున్నాను. చూడమ్మా!

ఉ. తాము వచించు తత్త్వము యథార్థములన్యములెల్ల దోషముల్
గా మతినెంచి తీవ్రముగ ఖండనజేసెడివారి జేర నా
కేమొ మనస్కరింపదిక, దృష్టుల నే యనుభూతిపైన నే
నేమముతోడ నిల్ప గరుణింపుము, మొ్రక్కెద ‥ 34

అమ్మా! తాము చెప్పినదే యథార్థమని, యితరమంతయు దోషమని భావించి, దూషిస్తూ ఉన్నవారిని చేరటానికి నాకు యిష్టం లేదు. నియమముతో నా దృష్టి నే అనుభవంమీద నిలిచేటట్లుగా ఆశీర్వదించుతల్లీ! నమస్కారం.

చ. అనుభవమైనదాని దెలియం గడు కష్టము, నేర్చినట్టి దా
నిని వచియింప గష్టమగు, నిర్వచియించినదాని వ్రాయు ట
న్ననదియు గష్టమౌ! నిక ననంతములెట్లులదెల్పు శాస్త్రమం
చని తలతున్ గదా! సకలశాస్త్రవిదూరమ! ‥ 35

అమ్మా! అనుభవాన్ని గ్రహించటం చాలా కష్టం. తెలిసిన దానిని వచించటం యింకా కష్టం. పలికిన దానిని వ్రాయటం మరీ కష్టం. మరి శాస్త్రములు ఆ అనంతత్త్వాన్ని ఎట్లా చెప్పగలవు? నీవో! సకలశాస్త్ర విదూరవుగదా!

ఉ. కష్టమెరుంగుటే, పిదప గష్టము దానిని విశ్వసింపగా,
గష్టము సాధనల్ సలుప, గష్టము సాధ్యము బొంద, నీవిధిన్
గష్టములెన్నొ పెట్టి కడు గష్ట పరంపరలందు ముంప, నే
కష్టములెల్ల దాటి నిను గష్టము బొందుట ‥ 36

అమ్మా! మొదట తెలుసుకోటమే కష్టం. తర్వాత దానిని నమ్మటం యింకా కష్టం. ఆపైసాధన చేయటం మరీ కష్టం. పిమ్మట సాఫల్యాన్ని పొందటం కష్టాతికష్టం. ఒకవేళ యీ కష్టపరంపరల్ని దాటినా, నిన్ను చేరుకోటంమాత్రం చాలా కష్టంసుమా!

చ. నిను గను భాగ్యమొందకయె నే మృతినొందెదనేమొయను చిం
తనము పదమ్మమున్ గవిసి ధైర్యము బాపు, ననిత్యమన్న నీ
తనువగు, గాదు ఆత్మయను తత్త్వము నమ్మెదు, గాని శంక నా
శనమగురీతి గన్పడదు సల్పిన యత్నము .. 37

అమ్మా! నీదర్శనభాగ్యం పొందకయే మరణిస్తానేమో అనే చింత నాకు అప్పుడప్పుడు కలిగి, అధైర్యం ఏర్పడుతుంది. ఈ శరీరం అనిత్యమని, ఆత్మ నిత్యమని నమ్ముతాను. అయినను నా యీ ప్రయత్నం నా సంశయాన్ని పోగొట్టటం లేదు తల్లీ!

చ. నిను గనగల్గుటో నదియె నిత్యవిభూతియు మోక్షలక్ష్మి యం
చని ముదమొందుచున్ మరల నాసను బొందక దృప్తి గాంచి నే
మనుదును నీదు సన్నిధిని, మాట పరీక్షను సేయుమమ్మ! నా
కనులకు విందువౌనటుల గన్పడుమమ్మరో! .. 38

అమ్మా! నిన్ను దర్శిస్తే అదే నాకు మోక్షం అని, అదే నిత్యానందమని ఎంచి ఆశారహితుడనై, నీ సన్నిధిలో తృప్తిగా జీవిస్తాను. నేను మాట తప్పను. పరీక్షించుకో! నాకన్నులకు కన్పించి పండుగ చేయి తల్లీ!

ఉ. కన్నులులేవ నిన్ను గనగన్? గలవే! చెవులో వినంగ? నా,
యున్నవి! నోరు నిన్ బొగడ? నున్నది! తెల్వియొ? యున్న
దే! మరే
మున్నది నాకు లేనిగుణమూహకురాదె భవాని! పోనీ, లే
కున్న.గుణంబు నిచ్చి నను నున్నతుజేయవె .. 39

అమ్మా! నీవు వస్తే చూడటానికి నాకు నేత్రములున్నవి. నీవు మ్లాటాడితే వినటానికి చెవులున్నవి. నిన్ను సుతించుటకు వాక్కు ఉన్నది. ధీ శక్తి ఉన్నది. ఇక నాకు లేని గుణమేమిటో తెలియదే! భవానీ! ఆ లేని గుణాన్ని నాకు ప్రసాదించి నన్ను ధన్యనిగా చేయవచ్చునుగదా!

చ. దినమొకయేడుగా గడుపు దీనుడ, దుఃఖనిమగ్నుడన్, భవాబ్ధిలో
మునుగుచు దేలుచున్న చినపుర్వును! నిద్దురలేదు! సంతసం
బనునది సున్న! సంఘములు పోయినొసంగవు, శూన్యలోకమో
నను దరిజేర్పలేదు, నిను నమ్మితి బ్రోవుము .. 40

అమ్మా! నిన్నే నమ్ముకున్నాను. దీనుడను. దుఃఖసంద్రములో మునిగి ఉన్నాను. ఈ లోకంలో, సంఘంలో సుఖంలేదు. సంతోషం అసలు లేదు. నిద్రలేదు. ఈ సంఘాలు ప్రశాంతినీయజాలవు. ఈ లోకం నన్ను దగ్గరికి చేర్చదు. నిన్నే నమ్ముకున్నాను. రక్షించమ్మా!

ఉ. కాలము నిల్వుమన్న క్షణకాలముగానియు నిల్వకుండనే
కాలము బారిపోవు, శ్రమగల్గుట దానిని వెంటనంటగా
జాలను, కాలవాహినివి, కాళజయంబు గడించినావు, నన్
బాలనసేయ కాలమును బట్టుమొకించుక .. 41

అమ్మా! కాలం క్షణం నిలువక పరుగులు వేస్తున్నది. దానిని వెంబడించుట శ్రమయే. నీవు కాలవిజేతవు. కాలవాహినివిగదా! నన్ను రక్షించటంకోసమ్మైనా కొంచెం ఆ కాలాన్ని నిలుపు తల్లీ!

ఉ. ఆయువు నూరువత్సరములందురుగాని యథార్థమెంచ లే
బ్రాయపు జావులే యధికమౌ! నిక ముప్పది దాటె నాకు! నే
జేయగజాలునెద్ది? మరి జెందినదెద్ది? భయంబు గల్గు నా
యాయువుమాట నెంచగ, భయంబుల బాపుము .. 42

అమ్మా! జీవితం నూరు సంవత్సరాలంటారు. కాని యథార్థం ఆలోచిస్తే లేతవయస్సులోనే మరణములు అధికంగా ఉన్నవేమో! అప్పుడే నాకు ముప్పది వత్సరములు దాటినవి. ఇక నేను ఏమి చేయగలను? ఏమి పొందగలను? నా వయస్సుగూర్చి ఆలోచిస్తే నాకు భయం కలుగుతున్నది. ఆ భయాన్ని పోగొట్టుతల్లీ!

ఉ. పుట్టిననాటినుండియును బొందినదెద్దియు లేకపోయె! నే
గిట్టుట చేరువయ్యెను! నికృష్టతపోవగ నేమి సేసితిన్?
గట్టి ప్రయత్నమే యెరుగ కాళిక! నన్ను దరింపజేయ నీ
వెట్టుల నెంచినావొగద! ఈశ్వరి! శారద! .. 43

అమ్మా! కాళీ! ఈశ్వరీ! శారదా! పుట్టిననాటినుండి నేటి వరకు ఏమియు చేయలేదు. మృత్యువు సమీపిస్తున్నది. కాని నా నికృష్టత్వం పోవటానికి తీవ్ర ప్రయత్నమే చేయలేదు. నన్ను నీవు ఏవిధంగా తరింపజేయనుంటివో గదా!

ఉ. అర్థములేని జీవితపుటాశ్రయమొంది నిజంబెరుంగకే
వ్యర్థముగా జరించితినటంచు నెరింగితిగాని మార్గమే
యర్థముగాదు! నీ కరుణపైననె యాస, నాకు మో
క్షార్థమొసంగి బ్రోవవుగదా! శరణంటిని .. 44

అమ్మా! జీవితాన్ని వ్యర్థం చేసుకొని, యథార్థాన్ని గ్రహిం చనట్లుగా తెలుసుకున్నాను. కాని మార్గంమాత్రం అగమ్యగోచరం గా ఉన్నది. నిన్నే శరణు పొంది, నీ అనుగ్రహం మీదనే ఆశ పెట్టుకున్నాను. నాకు మోక్షాన్ని ప్రసాదించమ్మా!

చ. మరియొకరోజు పోయెగద! మాతరొ! నీదు దయార్ద్రదృష్టి నే
నరయగనైతి, జన్మమిక వ్యర్థముగాదె! విధాత వ్రాయు వ్రా
తలవిధమిద్దియేమొ! నను దగ్గర జేర్పగ, రక్షసేయ స
త్వరగతి రాగదే! పరమపావనరూపిణి! .. 45

అమ్మా! పావనరూపిణీ! నీ కృపాదృష్టిని పొందకయే మరి యొకరోజు పోయినది. జన్మ వ్యర్థం అవుతున్నది. ఇది బ్రహ్మ లిఖితమా? నన్ను దరి జేర్చి, రక్షించుటకు త్వరగా రా తల్లీ!

ఉ. నే నిను బాసియుండగలనే పరమేశ్వరి! యిట్టి యన్యదే
శాన, ననేక నూత్నజనసంఘముమధ్య భయంబుగల్గు! మా
యీ! నను బుట్టినింట దవ హృద్భవనంబులో బ్రపం
చాన నభావమైన సుఖసంపద నుంపుము .. 46

అమ్మా! ఈ దూరదేశంలో, కొత్తవారిమధ్య నిన్ను వదలి ఉండటం భయంగా ఉన్నది. నీ హృదయమే నాపుట్టినిల్లు. నన్ను అందుంచి, నాకు ప్రపంచాతీతమైన ఆనందస్థితుల్ని అనుగ్రహించు చాలు.

ఉ. 'అమ్మ' యటంచనాదిగ శివా! నిను గాంచక, నీ ముఖారవిం
దమ్మును జూడకే పిలిచి దాంతిని దృష్టి వహించుచుంటినో
యమ్మరో! నేటికైనను దయార్ద్రవుగావుగ! నిన్ను గాంచి 'మా
యమ్మ' యటంచు గౌగిలుదు నయ్యది భాగ్యము.. 47

అమ్మా! శివా! అనాదికాలంనుండి నిన్ను చూడక, నీ ముఖ పద్మాన్ని వీక్షించకయే 'అమ్మ' అని భావిస్తూ తృప్తి చెందాను. కాని నేటికైన నీకు దయరాదా? నిన్ను చూచి 'మా అమ్మ, అని కౌగిలించుకుంటాను'. అదే నాకు మహద్భాగ్యమమ్మా!

చ. తనువు నకారణంబగువిధాన ధరింపగ వద్దు వద్దురా
యనవు! వికారినై సుఖదమంచును దుష్పథవర్తినైన వ
ద్దనవుగ! పూర్తిగా జెడిన యంతట శిక్షితుసేతువంట! యీ
పని తగునమ్మ! న్యాయపరిపాలనసేయవె! .. 48

అమ్మా! నాకు తెలియక యీ శరీరాన్ని ధరించినప్పుడు 'వద్దురా' అనవు. వికారినై చెడుమార్గంలో తిరిగినప్పుడైనా 'తప్పురా'

ఇనవు. పూర్తిగా చెడినతర్వాత శిక్షిస్తావటగదా! ఇదేమి న్యాయము మ్మా? న్యాయంగా పరిపాలన చేయమ్మా!

ఉ. ఎన్నటిదాక నోర్తునిక! నిచ్చట దు:ఖమయప్రపంచమం
దెన్నటికోగదా! భగవతీ! భవపాశవిముక్తి గాంచుటల్!
ఎన్నడొ నీదు సన్నిధి ననేక విభూతివిలీనమొందుటిం
కెన్నడొ! నీకభేదగతి నేకమునొందుట.. 49

అమ్మా! ఎంతకాలం ఓర్చుకోవాలి? ఈ దు:ఖమయిష్ఠ ప్రపంచంలో భవపాశములనుండి ముక్తి పొందుట ఎప్పుడు? నీ సన్నిధిలో అనుభవాల్ని పొందటం ఎప్పుడు? నీకభేదమ్మై ఏకం కావటం ఎప్పుడు?

ఉ. ఎన్నివిధాల బట్టుకొననెంచిన జిక్కవు వెల్గుతోడ నీ
కున్నదె మైత్రి? రే దిరుగుచుందువు చిక్కవు రాత్రితోడ నీ
కున్నదె మైత్రి? సంధ్యలలోగూడ నదృశ్యవు సంధ్యతోడ నీ
కున్నదె మైత్రి? ఎట్లు గనుటో! నిను శారద! . 50

అమ్మా! శారదా! నిన్ను పట్టుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాను కాని దొరకవే! నీకు వెలుగుతో స్నేహమేమో పగలు కనిపించవు. రాత్రికూడా గోచరించవు. నీకు రాత్రితో స్నేహమేమో! మరి సంధ్యాసమయంలో కనపడవు. సంధ్యతో నెయ్యమేమో! ఇక నిన్ను ఏవిధంగా చూచేది?

ఉ. కానన భూములందు దిరుగాడుచునుందువటంచు చాలగా
గాననయాత్ర సేసితిని, కాటి జరించుచునుందువంచు నే
గానగనైతి నిన్నచట, కాపురమెచ్చట నీకు తల్లిరో?
నే నిను గాంచగూడదను నేమము బూనితె .. 51

అమ్మా! నీవు అరణ్యాలలో సంచరిస్తావనే అక్కడ గాలించాను. స్మశానవాసివేమో అని అక్కడ చూచాను. కాని నీ దర్శనం లభించ లేదు. అసలు నీ నివాసం ఎక్కడ? లేక నేను నిన్ను 'చూడకూడదు' అని నియమాన్ని పెట్టుకున్నానా?

చ. నిను గనగల్గురోజు, నిను నిశ్చలతన్ భజియించురోజు, నీ
గుణముల నెంచు రోజు, నిను గొల్చెడువారల జూచురోజు, నిన్
విని ముదమొందురోజులు వివేకముతో గన మంచిరోజులై
యనుపమ సౌఖ్యసంపదల హాయి నొసంగెడు .. 52

అమ్మా! నిన్ను దర్శించిన రోజు, నిశ్చలంగా నిన్ను కీర్తించిన రోజు, నీ గుణముల భావించురోజు, నిన్ను ఆరాధించిన వారిని గాంచు రోజు, నిన్నుగూర్చి విని, ఆనందించిన దినములే అమితానందాన్ని కలిగిస్తాయి నాకు.

ఉ. అమ్మనునిన్నుగాంచి హృదయమ్ము వికాసమునొందమొక్కుభా
గ్యమ్ము లభింపకుండుటను, కాంతలజూచు ముహూర్తమందు ప్రే
మమ్మున నమ్మలంచును నమస్కృతి జేయుచు తృప్తిగాంతునో
యమ్మరో! దర్శనంబిడిన నయ్యది భాగ్యము .. 53

అమ్మా! నిన్ను దర్శించి, హృదయము వికసింపగా నమస్కరించు భాగ్యం కలుగకుండుటచే స్త్రీలను గాంచినప్పుడు వారిని తల్లిగా భావించి, నమస్కరించి తృప్తిని పొందుతున్నాను. కాన నీ దర్శనం కలిగితే నా భాగ్యంగా భావిస్తాను.

ఉ. తల్లులచెంత పిల్లలు ముదంబున నాటల మున్గియున్న నా,
యుల్లము పొంగు, నీచరణయుగ్మముచెంత, మనోహరంబునై
చల్లని సన్నిధానమున శాంతమనంబున నాటలాడి రం
జిల్లెడు భాగ్యమెప్పుడని చింతిలుచుందును .. 54

అమ్మా! తమ తల్లుల చెంత ఆడుకుంటున్న పిల్లల్ని చూడ గానే నేను ఎంతో పొంగిపోతాను. నీ పాదముల చెంత, నీ చల్లని సన్నిధిలో నేనుకూడా అదేవిధంగా ఆడుకుంటూ ఆనందించే భాగ్యం ఎప్పుడో అని చింతిస్తూ ఉంటాను.

ఉ. రమ్మని యాదరింపగ బరాయి జనంబులకేమియౌను? పే
మమ్మన స్వంతతల్లి యొకమాటగ బిల్చిన చాలు! నంత జి
త్తమ్మన నున్న దుఃఖములుధ్వంసము నొందుటచిత్రమే! యిదే
రమ్మ! కుమారు బుణ్యము విరాజిలజేయుము .. 55

అమ్మా! రమ్మని ప్రేమతో ఎవరు పిలుస్తారు? ప్రేమమూర్తి యైన స్వంతతల్లి ఒక్కసారి పిలిస్తే చాలదూ! ఆ ఒక్క పిలుపుతో మనోగత దు:ఖములు నశిస్తాయనటంలో ఆశ్చర్యం లేదు. ఇక నైనావచ్చి యీ నీ బిడ్డ పుణ్యం పండించు తల్లీ!

చ. తల్లిరో, నిన్ను సర్వవనితాముఖపద్మములందు గాంచి, రం
జిల్లుదు మోదవార్నిధి నచింత్యవిధంబున, సర్వకాంతలున్
దెల్లము నీవెయౌట, నిక దేవిరో నీముఖదర్శనంబు నా
కెల్లవిధంబు శాంతినిడదే! పరమేశ్వరి! .. 56

అమ్మా! పరమేశ్వరీ! స్త్రీలందరిలో నీవే ప్రకాశిస్తున్నావని వారిని చూచియే ఆనందిస్తున్నాను. కాని నీవే నాకు నీ దర్శన భాగ్యం కలిగిస్తే, నాకు ఎప్పుడూ శాంతియేగదా!

చ. ఎవరికినైన నందకను నెల్లర దాగలమూచి నెట్టి, వా
రవసరవస్తువున్ గనక 'అమ్మను దాకితి, తల్లి దాకితిన్,
భవముల బాసినాడ' నని పల్కుచునుండగ నవ్వుచుం
దువుగద టక్కరీ! పరమదుర్లభశక్తిరో! .. 57

అమ్మా! దుర్లభశక్తిస్వరూపిణివి! అవసరమైన నిన్ను గాంచక

అనవసరముల జూచి, 'నేను దేవుని చూచాను. జన్మరాహిత్యం కలిగింది' అని మాటలు చెప్పేవారిని చూచి వారికందక నవ్వుతూ ఉంటావు. నీవెంత టక్కరివమ్మా!

చ. అటుల దయావిహీనవిధి నాటలముంచకు నన్ను, నాకు నీ
నటనలు చేటుచేయుగద నమ్ముమ 'పిల్లలయాట కప్ప చే
ట'టులగు, కాన నేదు పరమాద్భుతతేజతరంగపంక్తిపై
నటనము జేయు భాగ్యమును నాకిడుమమ్మరో! .. 58

అమ్మా! నా విషయంలోమాత్రం దయారహితంగా ప్రవర్తించవద్దు. 'పిల్లలు రాయి విసరిన కప్పలకు చేటు' అనువిధంగా నీ నటన నాకు చేటు కలిగిస్తుందిసుమా! కాని నాకుమాత్రం నీ అద్భుతతేజోపుంజముపై నృత్యం చేసే భాగ్యాన్ని ప్రసాదించమ్మా!

చ. జగముల సృష్టి జేసి, యతిసంకుచితత్వము బెట్టి, దు:ఖమే
జగమన బాధకల్పనము సల్పి, జయించిన ముక్తినిత్తు నా
జగముల జాటుచుంటివి! విశాలకృపాబ్ధివిగాదె! మమ్ము బ్రో
వగ దయరాద నీకు, భవబంధవినాశిని .. 59

అమ్మా! సంకుచితత్త్వం, దు:ఖం కలిగిన యీ ప్రపంచాన్ని సృష్టించి, దీనిని జయించినవారికి మోక్షం యిస్తానని ప్రకటిస్తున్నావు. భవబంధవినాశినీ! ఎంత విశాలకృపాసాగరానివమ్మా! మాపై నీకు దయరాదా? అమ్మా!

ఉ. 'ఎంత వివేకి స్రష్ట' యని ఎంచుదురెల్లరు చిత్రవిశ్వమున్
జింతనజేసి, కాని పరిశీలన జేసిన నిట్టి సర్వ వి
భ్రాంతుని నన్ సృజించుట భవానిరో! తెల్లము నేదు తెల్పె, నీ
వింత వివేకహీనవని ఎల్లరెరుంగరె! .. 60

అమ్మా! ఈ విచిత్రవిశ్వాన్ని చూచి 'సృష్టికర్త్రి ఎంత వివేకి'

అని భావిస్తూ ఉంటారు సాధారణంగా. భవానీ! కాని నావంటి భ్రాం
తుని సృజించటంలోనే నీ తెలివితేటలు వ్యక్తం అవుతున్నవి. నీవు
యింత వివేకహీనవను విషయం అందరికి తెలియదా?

చ. సదమ లమూర్తి కాళిక యసహ్యపుపుత్రుని నెట్లుగాంచె, నా
సదమలతత్త్వలోపమని సర్వజనోక్తిగ నన్నుజూచి, ప
ల్కెదరుగ! వాదుబోవ నను గేవల నిర్మలు జేయుమమ్మ! నే
సదమలకీర్తి నల్గడల శాశ్వతమొందగ .. 61

అమ్మా! నన్ను చూచినవారందరు 'పవిత్రమూర్తియైన కాళి
కాదేవికి యీ వివేకహీనుడు ఎట్లా కలిగాడు? ఇది ఆమె లోపమే'
అని అనుకుంటారు. కాన ఆ అపవాదును తొలగించుకోటానికైనా
నన్ను నిర్మలునిగా చెయ్యి. అప్పుడు నీ కీర్తి నలుదిక్కుల ప్రస
రిస్తుంది తల్లీ!

ఉ. ప్రతిఫలమౌను నీకళయె భాస్వరదీప్తుల బాలబాలికా
నుతముఖదర్పణంబుల, గనుంగొనగా నది నీదు ఛాయ! యే
ప్రతి గననట్టి నీదు ముఖరమ్యత గాంచిన నెంత మోద సం
స్థితి గనగల్గువాడనని చింతిలుచుందును .. 62

అమ్మా! నీ కళయే బాలబాలికా ముఖాలలో ప్రతిబింబిస్తుంది
కాని అది నీ ఛాయమాత్రమే. ప్రత్యక్షంగా నీ ముఖసౌందర్యాన్ని
తిలకిస్తే నాకెంత ఆనందం కలుగుతుందో అని యోచిస్తూ ఉంటానమ్మా!

చ. తనయుల వృద్ధిగోరి తలిదండ్రులు పుత్రుని బ్రాణమట్లు భా
వన గని యుండరే! సుతుడపార యశంబుగడింప దామె కీ
ర్తిని గనినట్లుగా దలపరే! యటులేగద నాదు కీర్తి నీ
కును? కరుణించి జ్ఞానమొనగూర్పుము మ్రొక్కెద .. 63

అమ్మా! జననీజనకులు తమ బిడ్డల అభివృద్ధికై వారిని ప్రాణ

సమానంగా చూచుకుంటారుగదా! తనయుల కీర్తిని వారు తమది గనే భావింతురుగదా! అట్లే నాకీర్తి నీదేగదా! దయతో నాకుకూడా జ్ఞానాన్ని ప్రసాదించమ్మా! నమస్కారం చేస్తాను నీకు.

చ. పటుతర భీకరాకృతివి భావన జేసిన భీతిగల్గు నే
నెటులిక గాంతునో! కరుణదృష్టి ధరించుచు నవ్వుమోముతో
నిట కరుదెమ్మ! నే సుతుడనే దయజూడుము! రామకృష్ణు నే
వెటుల గ్రహించినావొ స్మరియింపుము దండము .. 64

అమ్మా! నీవు భీకరమూర్తివి. తలుచుకుంటేనే భయం కలుగుతుంది. నిన్ను చూడటం ఎట్లా? రామకృష్ణదేవుని నీవు ఏవిధంగా అనుగ్రహించావో అదేవిధంగా నన్నుకూడా దయజూడు. చిరునవ్వు చిందే ముఖంతో, అపార కరుణార్ద్రదృష్టితో రా అమ్మా! నే బిడ్డను కదా అమ్మా!

ఉ. వింటివటమ్మ చిత్రమును! భీతి త్యజించుచు భ్రాంతియన్న నా
దుంటరి దుంప లోకమును దూరము జేసి భజింప నిన్ను, లో
మంట జనింప వెర్రిజనమంతయు హాస్యము సేయు, వారికిన్
గంటికి గోచరింపదు జగంబున మోసము .. 65

అమ్మా! ఈ విచిత్రం చూడు. భ్రాంతియను తుంటరిని నశింప జేసికోటానికి, యీ లోకానికి దూరంగా ఉండటానికై నిన్ను ఆరాధిస్తూఉంటే యీ లౌకికులు నన్ను అవహేళన చేస్తున్నారు. ఈ లోకంయొక్క మోసం వీరికి గోచరింపదుగదా!

ఉ. చూచెడివారు నవ్వ నను జూచుచునుండగ, నీవు సైతమున్
జూచుచు, నేదికాని విధి జూచుచునుంటివె ధర్మమమ్మ! నిన్
జూచుటకైగదా సతము జూపుల నీపయినుంచి సాక్షిగా
జూచుటకభ్యసించుటలు! చూడవె నా స్థితి .. 66

అమ్మా! నన్ను జూచి అందరూ నవ్వుతూ ఉంటే నీవు కూడా సంబంధంలేనట్లు చూస్తుండటం ధర్మమా నీకు? నిన్ను దర్శించటానికిగదా నా యీ ప్రయత్నం? నా దృష్టిని నీపై ఉంచి సాక్షిగా ఉండే అభ్యాసం సాగిస్తున్నాను. నా స్థితిని చూడు.

ఉ. తల్లిరో! నిన్ను వీడి నిజతత్త్వము బాసితి భ్రాంతిచేత, నీ
కల్లవిభేదమున్ దుడిచి, కౌగిటజేర్చి యభేదవృత్తి నీ
యుల్లమునందులేనమయియుండెడుభాగ్యమొసంగుమమ్మనా
యల్లరి బాపుమమ్మ సుతుడౌదుగదమ్మరో? .. 67

అమ్మా! భ్రాంతిచేత నిన్ను విడిచి, నిజతత్త్వాన్ని విస్మరించాను. ఈ అసత్యమైన భేదాన్ని పోగొట్టి, కౌగిట జేర్చుకో! నీ హృదయంలో లీనమైయుండే భాగ్యం నాకు ప్రసాదించమ్మా! నా అల్లరి పారద్రోలమ్మా! నీ బిడ్డనుగదా!

చ. అది ఘటియింపదా జనని! హాయిగ నిత్యము గానమాధురీ
మృదురవజన్యతన్మయతబ్రీతి నినున్ స్తుతియించుచున్, మహా
హృదమున నున్న యక్షరక పాలసుమాలికలో స్థలంబు ని
మ్మదియును మోక్షమంచనెద నీశ్వరి! శారద! .. 68

అమ్మా! శారదా! ఈశ్వరీ! ఆ విధంగా నీ హృదయంలో స్థానంలేకున్న యీ కోరికను తీర్చు. నిన్ను సదా కీర్తిస్తూ, తన్మయత్వంతో నిన్ను స్తుతిస్తూ ఉన్న నీ కంఠమునగల అక్షరకపాలమాలలో నాకు స్థానాన్ని అనుగ్రహించు. అదే మోక్షమని భావిస్తాను.

ఉ. నిత్యము నీవు, నిత్యమును నేనుగదా! యిక నీ యనిత్యమె
సత్యముగాని దేహప్రశంసయె యెందుకు? నిత్యనిత్యముల్
నిత్యవిభూతిలీలలను నిత్యముగా మనజాలియుండ నీ
సత్యముగాని యాటలిక జాలవె తెల్పుము .. 69

అమ్మా! నీవు నిత్యవు. నేనును నిత్యమే. అనిత్యమైనది దేహముగదా! నిత్యములు నిత్యవిభూతిని పొందుచుండగా యిక నీ అసత్యమైన ఆటలు ఎందుకమ్మా? నాకు చెప్పుమ్మా!

చ. అదిగదిగోను గంటి మధురామృతసారము నీదు నవ్వు, నీ
రదములనుండి పైకుబికి, రక్తి జరించెడు నన్ను జూచి స
మ్ముదమున దళ్తళక్కనుచు ముందుకు దుంకుచు నన్ను
ముంచెబో!
విదితము నీ యనుగ్రహము ప్రేమసుధాకరి! .. 70

అమ్మా! అదిగో! నీ మధురమైన చిరునవ్వు! మేఘముల నుండి బహిర్గతమై, తళుక్కుమనుచు, ముందుకువచ్చి నీయందు భక్తిగలిగిన నన్ను ముంచెత్తినది! ప్రేమసుధాకరీ! నీ యనుగ్రహాన్ని నేను గ్రహించుకున్నానమ్మా!

ఉ. నల్లని కారుమేఘముల నాట్యము సల్పుదువీవదో! ఫెళా
ఫెళ్లను మేఘగర్జనమ పంపగు బాటలు, తళ్తళక్కనే
తెల్లని దీప్తిపుంజములె తీర్చిన నీ చిరునవ్వుకాంతి! నా
యుల్లము పొంగిపోవు నమితోన్నతనర్తకి .. 71

అమ్మా! అదిగో! నీవు నల్లని మేఘముల్పై నృత్యము చేయుచున్నావు. ఫెళఫెళమను మేఘ గర్జనలే బాటలు! ఆ తెల్లని మెరుపులే నీ చిరునవ్వుకాంతి! ఉన్నత నర్తకీ! ఇటువంటి నిన్ను గాంచిన నా హృదయం పొంగిపోతున్నదమ్మా!

ఉ. కాంచిన సాగరున్, నదుల గాంచిన, గాంచిన వృక్షసంతతిన్
గాంచిన పక్షులన్, గిరుల గాంచిన, గాంచిన గీటకంబులన్,
గాంచుదు నీ విభూతి కళకాంతుల సర్వమయంబుగాగ, నే
గాంచెద నీ ముఖంబు నిక గన్పడుమమ్మరో! .. 72

అమ్మా! సముద్రాన్ని, నదుల్ని, అరణ్యాల్ని, పక్షుల్ని,

పర్వతాల్ని, కీటకాల్ని చూస్తూ ఉంటే నీవు సర్వాంతర్వర్తివనే భావం కలిగి, వాటిలో నీ ముఖపద్మాన్నే దర్శిస్తాను. కాబట్టి యిక నీవు కన్పించమ్మా!

ఉ. ఎప్పుడు వత్తువో యని యనేక మనోక్రియలన్ ద్యజించి, నే
నెప్పుడుగూడ నా యమలహృద్భవనంబును తీసి యుంచి, నే
నెప్పుడు నీదు రాకకయి దృక్కుల దిక్కులకిచ్చి వేచియుం
టెప్పుడు వత్తువోగద! మహేశ్వరి! శారద! .. 73

అమ్మా! మహేశ్వరీ! శారదా! నీవు ఎప్పుడు వస్తావో అని నా మనోవృత్తుల త్యజించి, నా నిర్మల హృదయమను భవనాన్ని తెరిచి, నాల్గు దిక్కులను పరికిస్తూ, నీ రాకకోసం చూస్తున్నాను. ఎప్పుడు వస్తావమ్మా?

చ. నిను గననుంటిగాని యిక నిక్కము సెప్పెద, నీకు స్వాగతం
బు నిడు విధానమే నెరుగ! పుత్రుడ గావుట గౌగలింతునో!
వినతి బ్రణామమిచ్చెదనో! ప్రీతి మృదూక్తుల నుచ్చరింతునో!
కనిన క్షణంబు స్థబ్దతను గాంతునో! ఎట్టులో! .. 74

అమ్మా! నీకు యథార్థం చెప్పుతున్నాను. నిన్ను చూడాలని తపిస్తున్నానే కాని నిన్నెట్లా ఆహ్వానించాలో తెలియదుసుమా! నీ కుమారుడిని కాబట్టి కౌగలించుకుంటానో! లేక నమస్కరిస్తానో! లేక ప్రేమతో మాట్లాడుతానో! లేక నిన్ను చూడగానే ఆనందంలో మైమరచిపోతానో! ఏమో!

చ. అనుపమమందహాసమధురామృతధారయటన్న నీదు ద
ర్శనమున దృష్టిగాంచక నశాంతత సర్వ మతంబులందు దా
ననుభవసంపదల్ గనగ నాసను జూపిన రామకృష్ణురే
తిని విసివింతునా? భయము దేనికి? శారద! .. 75

అమ్మా! శారదా! నే దివ్యదర్శనభాగ్యాన్ని పొంది, నే మందహాసవదనారవిందాన్ని గాంచియు తృప్తిపొందక, సకల మతా సుభవసంపదను పొందగోరు శ్రీరామకృష్ణునిపలె నిన్ను విసిగింతు నేమో యని నీకు భయమేమో!

చ· కనపడినంతనే మిగుల గష్టవిభాజనమైన నా చరి
త్రను వివరించి నీహృదిని రాపిడి చేయుదునన్న భీతియో!
కనక ననాదినుండిపుడు గాంచుటచే నినుబట్టి వీడకుం
దునను భయంబొ! చెప్పుమిక దోషమదేమియొ! ·· 76

అమ్మా! నీవు కనిపించగానే నా వ్యథామయ జీవితాన్ని నీకు చెప్పి, నీ హృదయానికి బాధను కలిగిస్తానని భయమా? లేక యింత కాలము నీవు కనిపించకుండుటచే యిప్పుడు నిన్ను పట్టుకుని వదలనని భయమా? అసలు నా దోషమేమిటో చెప్పమ్మా!

ఉ· వచ్చినతోడనే మొదట స్వాగతమిచ్చి, సుఖాసనాదిచే
హెచ్చుగ షోడశాదివిధి నే నుపచారపు సేవలన్నిటిన్
నచ్చగసేసి, యంత నిను నాట్యకళన్ సుఖనిద్రబుచ్చి, పై
బెచ్చుగ జేయనెద్దియును ప్రేమసుధాకరి! 77

అమ్మా! ప్రేమసుధాకరీ! నీవు వచ్చినంతనే మొదట స్వాగతం చెప్పుతాను· ఆపై షోడశోపచారాలతో పూజిస్తాను· ఆతర్వాత నా నాట్యంతో నిన్ను సుఖనిద్రలో ముంచుతాను· ఇంతకంటె వేరే మియు చేయనమ్మా!

చ· మరియొకమాట, నే నపుడు మాటకునైనను ఒక్కమాటగా
మరియొక మాటలేక కడుమండెడు నాహృది విప్పవచ్చునా?
సరి సరి! నీ వెరుంగవట సర్వము! చూడుము వెర్రివాడ! నా
చరితము, నేను, నాదియును సొంతము నీయవి ·· 78

అమ్మా! మండుతున్న నా హృదయబాధనుగూర్చి ఒక్క మాటలో నీకు తెలియచేసుకోవచ్చునా? ఎంత వెర్రివాడనో చూడు! నేను, నాది అన్నీ నీవేకదా! ఇక నీకు తెలియనిదేమున్నదమ్మా!

ఉ· తొలిగల కర్మపాశముల దుంపగ జన్మముగల్గు, గాని, క
ర్మల దెగటార్పబోయి బలమన్నది శూన్యముగాన, కర్మబ
ద్ధులగుచు మ్రగ్గుచుందురుగద దుంపగబోయియు దుంప
బడ్డటుల్
దెలియగ గర్మ కష్టమగు దెల్పు మదంబ రో! ·· 79

అమ్మా! ప్రథమమున గల కర్మపాశముల త్రెంచబోయిన జన్మము కలుగుచున్నదిగదా! కర్మ నాశనం చేయాలంటే బలం చాలా అవసరం· ఆ బలము లేక జీవులు కర్మబద్ధులగుచున్నారు· ఈ కర్మ విషయము గ్రహించుటకు చాలా కష్టం· కాబట్టి దీని విషయం తెలుపమ్మా!

ఉ· ఈ తొలికర్మ యెచ్చటిదో? యీ తొలియన్నది గల్గుటెన్నడో?
ఏ తెరగో? మరెందులకొ ఇయ్యది గల్గుట? కాగలట్టి ప్ర
శ్నాతతి బాధసేయుచు బ్రశాంతత భగ్నము సేయుచున్నదే
మాతరో! కర్మసూత్రమను మర్మము జెప్పవె ·· 80

అమ్మా! 'ఈ మొదటి కర్మ ఎక్కడిది? ఈ 'తొలి' అన్నది ఎప్పుడు ప్రారంభం అయినది? ఏ విధంగా ప్రారంభం అయింది? ఎందుకు కలిగింది?' అను ప్రశ్నావళి నన్ను బాధిస్తున్నవి· ఈ కర్మసూత్ర రహస్యం చెప్పమ్మా!

చ· అడుగగరాని ప్రశ్న యిది యైనను దెల్పుము, దీనికెందరో
గడబిడ్డయిరి గాన నిది గట్టిగ నేర్వగ ముఖ్యమమ్మ, యీ
పెడపథమెందుకంచనెదవే? సరి, కొండొక ప్రశ్న జెప్పి నే
నడిగెద చిన్నదే, తెలుపుమమ్మ! కృపానిధి! ·· 81

అమ్మా! కృపానిధీ! ఈ ప్రశ్న వేయరానిదే అనుకో. కాని దీనికి పెద్దలు ఏవో చెప్పి తీర్మానించారు. అయినా యిది చాల అవసరం. 'నీకు యీ పెడత్రోవ ఎందుకురా' అంటావేమో! అయితే, మరొక చిన్న ప్రశ్న వేస్తాను. చెప్పమ్మా!

చ. అడుగుదునా? సరే వినుము, హాయి జరించెడు నీకిదెందుకీ
గొడవ? సృజింపనేల? నట గూర్మి భరింపగనేల? నంత బై
బడి తెగటార్పనేల? ఇది భగ్నము సేయదె నీదు శాంతి? నే
నడిగితినన్న కోపమ? దయానిధి! శారద! .. 82

అమ్మా! శారదా! సరే విను. సుఖంగా ఉండక యీ గొడవ ఎందుకు నీకు? సృష్టి చేయటం ఎందుకు? ప్రేమతో పోషించటం దేనికి? తర్వాత దాన్ని నశింపజేయటం ఎందుకు? ఇది నీ ప్రశాంతికి భంగము కలుగచేయదా? దయానిధీ! అడుగుతున్నానని కోపమా అమ్మా!

చ. నిరతము గొల్తు నిన్ను మది నిక్కముసుమ్మిది నిత్యమంగళా!
పరమపదంబు నీవె! భవపాశవిముక్తికి గారణంబుగా
స్థిరముగ నమ్మినాడ, భవదీయ సుతుండ, ననుగ్రహంబుతో
దరి నను జేర్పుమమ్మ! సుఖదంబగు నయ్యది .. 83

అమ్మా! నిత్యమంగళస్వరూపిణీ! నిన్ను నిత్యం ఆరాధిస్తున్నాను. సత్యం. నీవే మోక్షానివి. భవపాశవిముక్తికి నీవే కారణమని నమ్ముకున్నాను. అనుగ్రహించి నీ వద్దకు జేర్చుకో. నీ బిడ్డనుకదా! నాకు అదే సుఖమమ్మా!

చ. సకలగుణాలవాలమని శాస్త్రము నిన్ను వచించుగాని, నే
నిక విన దాని, గాంచి భరియించి హరించుట మంచిదౌను, కా
ని కఠినబుద్ధి శిక్షణమనేక పరీక్షల బాధనుంచి, సా
ధకులను హింస సేయుట విధాయకమౌనొకో! .. 84

అమ్మా! నీవు సకలగుణసంపన్నవను శాస్త్రవచనములను యిక నేను వినను. సృష్టి స్థితి లయముల చేయుట మంచిదే కాని సాధకులను అనేకవిధముల బాధించి, పరీక్షించి, హింసించుట న్యాయమా?

చ. పిలిచిన రావు నన్నిచట భీకరకూపమునందు ద్రోసి, యే
డ్పులు వినరాని చెడ్డచెవుడో నిను బట్టె నికేమిసేతు! చం
చలితమనంబునుంటి! నిక సాయము జేయవె పుణ్యముండు! నీ
యలుకకు హేతువెద్ది చెపుమా! కృప శారద! .. 85

అమ్మా! శారదా! ఈ భయంకరమైన ప్రపంచకూపంలో నన్ను ద్రోసివేశావు. పిలిచినా పలుకవు. నా ఏడ్పు వినపడని చెవుడు నీకున్నదేమో! మనోచాంచల్యముతో బాధ పడుతున్నాను. నీకు పుణ్యం ఉంటుంది నాకు సహాయం చెయ్యి. నీ అలుకకు కారణం ఏమిటమ్మా!

చ. అవసరమేమి నిన్ బ్రతిమలాడగ? నన్ గనునప్పుడేపెరుం
గవొ నను బెంచు బాధ్యతయు గల్గుట? తప్పునటంచునెంచియుం
డువిది యకీర్తిగాదె! ప్రజ దూషణ జేయదె? కాన సం
భవమునవోలె రక్షణపు బాధ్యత బూనుము .. 86

అమ్మా! నన్ను పుట్టించునప్పుడే, నన్ను పెంచు బాధ్యత కూడ నీకున్నది. బాధ్యతా దూరవైనచో నీకు కీర్తి కలుగదు. ప్రజ నిన్ను దూషిస్తారు. అందుచేత పుట్టుక, రక్షణల బాధ్యతను తీసుకో! అసలు నిన్ను బ్రతిమాలటం దేనికమ్మా!

ఉ. రావుగదమ్మ! రావికను! రావుగ! రావుగ! మూడుసార్లకున్
రావుగ! నిశ్చయంబుగను రావనుమాట యథార్థమే! సరే
రావలదమ్మ! హెమ్మికను రాకుము! నీ సఖియత్వమేల? పో
రావలదింక! నన్ బిలువ! రాకుము పల్కను .. 87

అమ్మా! మూడుసార్లు పిలిచాను. రావన్నమాట నిజమేనా? సరే? యిక రావద్దు. నీ స్నేహం ఎందుకు? యిక నన్ను పిలవటానికి రావద్దు. వచ్చినా నీతో మాట్లాడను. పో రావద్దు.

ఉ. నాదిక దప్పుగాదు! నిను నమ్మిచు స్నేహము సేయనెంచి ని
న్నేదియు గోరకుండ దపియించుచు నెంతని పిల్చినాడ! ఔ
నేదియ తప్పు కాన నిక నీవు క్షమాపణ గోరి యంతనే
రాదగు! లేకపోయిన బలాయనగమ్మిక .. 88

అమ్మా! నిన్ను నమ్మి, నీ స్నేహంకోరి, నిన్నేదీ అడగక, తపిస్తూ, నిన్ను ఎంతగానో పిలిచాను. నా తప్పు లేదు. ఇక తప్పంతా నీదే! ఇక నీవు రాదలచిన క్షమాపణ చెప్పి రావలసినదే! లేనిచో రావద్దు పో.

ఉ. పాపము నీముఖంబు వెలబారినదేమొకొ? దేహమెందుచే
తాపము జెంది చెమ్మటలు దాల్చెను? దీర్ఘపు శ్వాసలేల? నా
కోపము పోయె! పోవలదు, కోర క్షమాపణనైన! రమ్మి! రా
వే! పలురీతులన్ మనుదుమిద్దరమాటల .. 89

అమ్మా! పాపం, నీ ముఖం అట్లా ఉన్నదేమి? శరీరం చెమట పట్టిందేమి? నిట్టూర్పు విడుస్తున్నావేమి? నా కోపం పోయిందిలే! పోవద్దు. క్షమాపణకూడ వద్దులే! రావే! మనం ఎన్నో మాటలు చెప్పుకుందాములే!

ఉ. గట్టిగ బల్కినాడనని కాళిక! కోపమ నీకు చెప్పవే?
వట్టికి బల్కినాడ, నిది వట్టిది నమ్మిము వెర్రిదాన! నా
పట్టుదలన్ గ్రహింపవే! స్వభావమదట్టిది, నీవెరుంగవే!
గట్టిగనుందు భక్తి, హృది గాంచిన పెన్నయె .. 90

అమ్మా! కాళికా! గట్టిగా అన్నానని నీకు కోపం వచ్చిందా?

ఊరకే అన్నాను. నిజం. వెర్రితల్లీ! నా పట్టుదల, నా స్వభావం నీకు తెలియదా! పైకి గట్టిదనమేకాని నా హృదయం నవనీతమేసుమా!

ఉ. దొంగవు నాకు చిక్కితివి, దొంగిలి నా హృదయంబు నీవు, నీ
దొంగతనంబు దాచుటకు దొంగవలెన్ దిరుగాడినన్ సదా
దొంగల బట్టుచుండి మరి దొంగల దండనసేయు నేను నీ
దొంగరికంబెరింగి నిను దొంగనుబట్టనొ! .. 91

అమ్మా! నా హృదయాన్ని దొంగిలించి, నీవు దొంగ వయ్యావు. ఆ దొంగతనం దాచుకుంటూ, దొంగలాగ తిరుగు తున్న నిన్ను, దొంగలను పట్టుకొని, దొంగలను శిక్షించు, నేను నీ దొంగతనాన్ని గ్రహించి, పట్టనునుకున్నావా అమ్మా!

చ. కని భరియించి మాపుటలకారణ కార్యములంట, యెన్నడున్
గని విననట్టి హింస, పనిగాంచక సేయుట తప్పుగాదె! శి.
క్షణమునకీవు పాత్రివిక! గాన మదీయహృదంతరాళమం
దు నిను నిబద్ధుజేసితిని దుర్గ! పరాంబిక! .. 92

అమ్మా! పరాంబికా! దుర్గా! ఇదేమి హింస? నీకు పనిలేదని అకారణంగా సృష్టి స్థితి లయాల్ని చేయటం తప్పుకదా? కాన నీకు శిక్షవేయాలి. నాహృదయంలో నిన్ను బంధించాను. ఇదే నీకు శిక్ష.

చ. ఇపుడెటువోవనెంచినను నింక నసాధ్యముసుమ్మి,నన్ను చా
ల పరితపింపజేసితివి, ప్రాణము డస్సినదమ్మ! యింక నీ
వపరిమితంబవైనను సుభక్తి నిబద్ధుగ జేసినాడ ని
న్నెపుడికపైన వీడ భవహేతువినాశిని! .. 93

అమ్మా! జన్మకారణప్రణాశినీ! ఇక నీవు తప్పించుకోటం అసాధ్యంసుమా! నన్ను చాలా బాధపెట్టావు. ప్రాణం అలిసి

పోయిందమ్మా! నేవు అనంతతత్త్వాన్నివైనా నా భక్తితో నిన్ను బంధించాను. ఇక నిన్ను ఎప్పుడూ వదలనుసుమా!

ఉ. ఎప్పుడు నేవు లోకము నహీనవిధంబున జూచి బ్రోతువో,
తప్పులు లేక సేతువను ధైర్యము గల్గునొ నాకు, వింటివా?
అప్పుడు నే విముక్తి, యిక ధ్యాననిమగ్నత నుండి నీవు నే
ర్పొప్ప జరింప నాజ్ఞ యిది లోకహితంకరి! .. 94

అమ్మా! లోకహితంకరీ! ఎప్పుడు నేవు లోకపరిపాలన చక్కగా జేయగలవనే ధైర్యం నాకు ఏర్పడుతుందో అప్పుడే నేకు విముక్తి. విన్నావా? అంతవరకు నేవు ధ్యానం చేసుకో, ఇదే నా ఆజ్ఞ.

ఉ. లేదు జపాల ధ్యానముల, లేదది కీర్తన యోగపద్ధతిన్,
లేదు విచారణంబులను, లేదుగ కర్మల శాస్త్రసంతతిన్,
లేదు ప్రసంగవాహినుల, లేదుపదేశములందు, మాతరో!
నేదు యనుగ్రహంబుననె నే నిను గాంచుట .. 95

అమ్మా! జపధ్యానములు, సంకీర్తనలు, యోగపద్ధతులు, కర్మలు, శాస్త్రవిచారణలు, ఉపన్యాసపరంపరలు, ఉపదేశములు, నే దర్శనభాగ్యాన్ని కలిగించవు. నే అనుగ్రహంచేతనే నిన్నుచూచే భాగ్యం కలుగుతుందమ్మా!

ఉ. ధైర్యము తేజరిల్ల మతిదార్ఢ్యతనొంద వివేకియౌచు నే
కార్యము జేసినన్ దనను గాంచుచు బూర్ణప్రజ్ఞగల్గి యా
కార్యము సేసి బంధమును గాంచక ఖ్యాతి చరించువాడెవో
ఆర్యపథానువర్తి పురుషార్థము నద్దియె .. 96

అమ్మా! ధైర్యం ఉప్పొంగ, దృఢ మనస్కుడై, వివేకియై, సర్వత్ర ఆత్మను గాంచుచు, పూర్ణప్రజ్ఞకలిగి, కార్యముల జేసినను బంధము లేనివాడై, చరించువాడుమాత్రమే ఆర్షమార్గమును అనుసరించువాడుగదా! అదే పురుషార్థంకూడా.

చ· అదిగద మూలసూత్రము, రహస్యము; కీలకమన్న, దాని నె
మ్మది గ్రహి యించి సల్ప పరమార్థమటన్నది దూరమే? సుఖ
ప్రదమిది యంచు దెల్పితివి, భాసిలు 'సెల్ఫు ఎవేర్నె' సంచు నా
నిది గనినాడ! ధన్యుడ మహేశ్వరి! శారద! ·· 97

అమ్మా! మహేశ్వరీ! శారదా! అదే మూలసూత్రము·· రహస్యము· కీలకము· దానిని గ్రహించిన పరమార్థము దూరము కాదు· ఇదియే సుఖమనియు, 'సెల్ఫ్ ఎవేర్నెస్' అనియు గ్రహించియున్నాను· ధన్యాత్ముడను·

చ· భయము భయంబటంచు మరి భావనచేయుచు నీడ గాంచినన్
భయమును జెందనేల? నను బాలనసేయగ బ్రేమతో జగ
న్మయముగ నీవు సర్వమున మాన్యత గన్పడుచుండ నింక నే
భయమును లేదు నాకు భవపాశవినాశిని! ·· 98

అమ్మా! భవపాశవినాశినీ! నన్ను పరిపాలించుటకు నీవు లోకాంతర్గతవైయుండ, నిక నాకు భయమెందుకు? 'భయం' అంటూ నీడను చూచి పరుగులెత్తటం దేనికి? ఇక నాకు భయంలేదమ్మా!

ఉ· అమ్మవు నాకు, సర్వభువనాళికి, లోకవిధాత, ధాత్రకున్,
అమ్మవు సర్వహర్తకు, గుణాన్వితమూర్తి యనాదిశక్తికిన్
అమ్మవు కారణంబులకు, నౌట గ్రహింపగ దుర్లభంబు, నా
నమ్మకమౌట గైకొనుము నన్నిక బుత్రిడ ·· 99

అమ్మా! నీవు నాకు తల్లివి· త్రిమూర్తులకు, సర్వలోకానికి తల్లివి· సగుణమైన ఆద్యశక్తికి తల్లివి· సర్వకారణములకు నీవే తల్లివి· అందుచేతనే నిన్ను గ్రహించటం చాల కష్టమని నా నమ్మకం·

చ· జయమగుగాక! నీకు అనిశమ్ము నినున్ శరణన్నవారికిన్
జయమగుగాక! నిర్విషయసంపదనున్న విరక్తి కోటికిన్

జయమగుగాక! జ్ఞానమయసర్వవిభూతి గడించువారికిన్
జయమగుగాక! యెల్లపుడు సత్యవిశారద! ·· 100

అమ్మా! సత్యవిశారదా! నీకు జయమే! నిన్ను శరణు పొందినవారికిని జయమే! నిర్విషయులైన త్యాగమూర్తులకు జయమే! జ్ఞానమును పొంది సర్వానుభూతి గడించినవారికిని సదా జయమే యగుగాక!

ఓం హరి: ఓం తత్సత్



సా ధ క లో కా ని కి అ పూ ర్వ కా ను క!

A RARE GIFT ON THE PATH OF SPIRITUAL WORLD!

సాధకులందరూ తప్పక చదువదగిన ఉత్తమ గ్రంథము

11 ముద్రణముల పొంది, వేలాది ప్రతులు అమ్ముడై, ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణములలో అపూర్వ సంచలనము కల్గించి, ముముక్షువులకు సాధనామార్గములో మార్గదర్శియై, పత్రికల, పండితుల, పాఠకుల, ప్రముఖుల ప్రశంసల పొంది, సాధకుడు చేయవలసిన ఆధ్యాత్మిక సాధనావిధానము లను చక్కని వ్యావహారిక భాషలోదెలిపి, అశేష ప్రజాదరణ పొందిన అనుష్ఠానప్రబోధాత్మక మహోత్కృష్ట గ్రంధరాజము.

అ ను భ వ స్వ రూ పు లు

'శ్రీ అ ను భ వా న ం ద స్వా మి' విరచిత ...

సా ధ న ర హ స్య ము

The Secret Of Yoga Sadhana

భగవత్ సాక్షాత్కార మార్గమును తెలియజేసిన యీ అనుభవైకవేద్యగ్రంథము 20 భాషలలో ప్రకటింపబడనున్నది. కొన్ని భారతీయ భాషలలో ప్రకటింపబడినది.

1/8 డెమ్మీ వెల : 35-00

'సాధనరహస్యము' కంటె ఆత్మసాక్షాత్కారమార్గమును తెలుపు అనుభవపూరిత గ్రంథము దుర్లభము.